## ఖండేరావుగారిపై దెబ్బలు!

# మహాత్ముని లేఖ

(ఒ-వి) బాదేపల్లి ౧౯-౧-౫౧

జడిచర్ల అమీనాగారు శ్రీ పెనుమార్ల ఖండే రావుగారిని స్టేషనుకు పిలిపించి ౫౭ గురు జవానులచే కట్టించిరను వార్త గోలకొండ పత్రికలో ప్రకటింపబడియుండెను- తదనంతరకథను గూర్చి పలువురు ప్రశ్నించు చున్నందున ఈపత్రికాముఖమున పాఠకులకు తెలుపుకొనుచున్నాను-

సెప్టెంబరు ౧౦-వ తేదీన జిల్లా అవ్వల్ తాలూక్దారుగారికిని జిల్లా మొహతమీమ్ గారికిని ఖండే రావుగారిదెబ్బలు చూపించబడెను- మొహతమీమ్ గారి ఆజ్ఞానుసారం ఒకదరఖాస్తును యిచ్చి జిల్లాసర్జనుగారిచే పరీక్ష చేయించబడెను. హైద్రాబాద్‌లో హోం సెక్రటరీ గారినికలిసి వారికి దెబ్బలు చూపించబడెను- హోం సెక్రటరీ గారు తగు విచారణ గావించి న్యాయము చేతురని వాగ్దానము చేసిరి.

బ్రిటిష్ యిండియానుంచి నైజాంగుండా ఢిల్లీకి పాదచారులై వెళ్లుచున్న సత్యాగ్రహులు బాదేపల్లికి వచ్చినప్పుడు ఖండేరావుగారి అతిథులుగా యుండిరి- వారు ఈదెబ్బలుచూచి ఆశ్చర్యపడి మనప్రధానమంత్రిగారి కోశ లేఖ్రవాసి నకలును మహాత్మా గాంధిగారికి పంపిరి- మహాత్మాగాంధీగారు తమ సానుభూతిని తెల్పుచూ శ్రీయుత జానపాటి సత్యనారాయణగారికి కార్డువ్రాసిరి- కార్డులోని విషయము ఇంగ్లీషునుండి తర్జుమాచేసి క్రిందయివ్వబడినది.

జడిచర్ల సర్కిల్ యిన్స్‌పెక్టరుగారు సి-ఐ-డి యిన్స్‌పెక్టరుగారును కొంత విచారణగావించిరి- తదుపరి జిల్లా మొహతమీమ్ గారు విచారణగావించుచున్నారు. ఫలితము తేలిన వెంటనే పాఠకులకు నివేదించుకొందును,

### మహాత్ముని లేఖ

సేవాగ్రామం ౨౯-౯-౪౧.

"ప్రియమైన సత్యనారాయణ,

ఖండేరావుగారికి జరిగినదానికి నేను చింతిల్లుచున్నాను. ఆతడుపూర్తి ఆరోగ్యము చెందినట్లు నమ్ముచున్నాను- ఆతనికి అవసరమైన బలమును ధైర్యము భగవంతుడు ప్రసాదించు గాక యని నేను ప్రార్థింతును."

నీయొక్క బాపు.

## మధిర తాలూకా యుద్ధ కమిటీ సమావేశము

(స్వ. వి) మధిర, అక్టోబరు ౧౭

ఈరోజు మాల్గుజారీశాఖాధ్యక్షులగు డయిరక్టరు జనరల్ గ్రాహమ్ గారి అధ్యక్షత క్రింద జూబిలీ పార్కునందు సభసమావేశమయ్యెను సుమారు ౫-౬ వందల పురజనులు హాజరయిరి స్థానికతహసీలుదారు సాహెబు గారు యుద్ధము వలన కలిగిన మార్పులు ప్రజలకష్టములు ఎందుకలవ యుద్ధమునకు సహకారము చేయవలయునో వివరముగా ఉపన్యసించిరి. అటుపిమ్మట మ-రా-కొండపల్లి శేషగిరిరావు వకీలుగారు ఉర్దూలోను చతుర్వేదుల వెంకటకృష్ణయ్య వకీలుగారు తెలుగులోనున్నూ ప్రజలకు యుద్ధసమాచారమునుగురించి బోధించిరి. అటుపిమ్మట అధ్యక్షులు దిగువరీతిని ఉపన్యాసము గావించిరి నేడు కాలమానపరిస్థితులు విచారించుటకు వారావచ్చితిని. యుద్ధకమిటీసభ్యులకోరికపై ఈసమావేశములో నన్ను అధ్యక్షులుగా కోరినందుకు మిమ్ముల అభినందించుచున్నాను. ఇపుడుజరుగుచున్న ఘోర సంగ్రామము ప్రపంచవాసులందరికిని దుస్సహమైపోయినది. జర్మనుతనరాక్షస నాజీతత్వమును పరిహద్దునగల చిన్న చిన్న రాజ్యముల తనయినప కాళ్ళతో మర్దించి వారిస్వాతంత్ర్యజీవితములను భంగపరిచెనో మీకు తెలిసియేయున్నది. దాని కొరకు బ్రిటను అనేకవిధముల మంచిమాటలతో హిట్లరుకు హితోపదేశముచేసెను. కాని ఫలితము లేకపోయెను దుష్టుడగు బ్రిటను ప్రపంచవాసుల స్వాతంత్ర్యమునిలుపుటకు యుద్ధమునందు దిగవలసివచ్చెను. రెండుసంవత్సరములనుండి ఘోర సంగ్రామములో అజేయముగా బ్రిటను తనబలమును అభివృద్ధిపరచుకొనియున్నది. నీతిలేనిహిట్లరు రష్యాదేశముతో ౧౦ సంవత్సరముల (పాక్టు) వడంబడిక చేసుకొని వత్సరముదాటకపూర్వమే ఆక్రమముగా తెలుపకనే చిత్తుకొయినుదతె వడంబడికనుబట్టి దాడులు చేసి ఒకకాటివడితేయిన తనబలమువంతయును రష్యాపై విజృంభి ప్రజేకి దొంగయనిపించు కున్నాడు. రష్యా తనకుండిన బలమునొగ్గి భయంకరముగుతిరుగు దాడులుతీయుచున్నది, భారతదేశ సైనికులు ఇరాక్ అబిసీనియా లిబియా మొదలగు దేశముల తమపరాక్రమమును. శత్రువులకు బలి చూపిరి. భారతదేశ ముఖద్వారము వద్దకు యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లవచ్చు అప్పుడుమన ముత్వరపడినలాభము లేదు. ముందుగా మేల్కొనవలసియున్నది. అని ఉపన్యాసము ముగించి యుద్ధకమిటీవారు రెండువేలరూప్యములు శ్రీవారికి సమర్పించి యుద్ధకమిటీ సభ్యుల నెల్లరిని తరువాత హృదయపూర్వకమైన ప్రేమతో తెచ్చి కమిటీసభ్యులచేతు, కలిపిరి చందాలొసంగినవారికి ప్రేమపూర్వక వందనములాచరించిరి- రెండవదినము గ్రామములోనడిచివెళ్లి రయితులను కాలమానపరిస్థితులు కనుగొనిరి- అనేక మందిదరఖాస్తులు కియప్రమునకు చి లోస్తులు కిచియిచ్చిరి, అందరికిని గుసహాయము చేయుటకు వాగ్దత్తము జేసెను శ్రీ మాదవాటి రామచంద్రరావుగారును కేశవరావుగారును పద్మవాళక శ్రీ వి-ఎ-టియల్ గారును తాలూకా పరిస్థితులు కరువుజంగ్లాతు భూములలో పశువుల మేతనుగురించి యిక్కట్లు బెజవాడరోడ్డు మధిరరోడ్డు కలుపుటగురించియు ఒకగంటకాలము చర్చజరిగినపిమ్మట నోటుపుస్తకములో వ్రాసుకొని కొద్దిదినములలో సహకారము కలుగునని నమ్మడి అనిశెలవిచ్చిరి- ప్రజలందరును వారి ప్రజారణకు సానుభూతిజూపిరి.

## గద్వాలలో గాంధీజయంతి

(స్వ. వి)

౨వ అక్టోబర్ దినమున శ్రీమహాత్మా గాంధీగారి జయంతిజరుపుటకై శ్రీకృష్ణమందిరములో నొకగొప్పసభ జరిగినది. సభకుచాలామంది ప్రేక్షకులు వచ్చియుండిరి సభలోరయిత్తయినస్థలమున శ్రీ గాంధీగారిపోటో అలంకరించిపెట్టబడియుండెను. సభ్యులఆజ్ఞా ప్రకారం శ్రీనరసారెడ్డిగారు సభకు అధ్యక్షతనువహించిరి.

మొట్టమొదట యిక్కడి ఉన్నత పాఠశాల బాలికలు జాతీయగీతములపాడిరి. తరవాత స్థానిక ప్రముఖులును, విఖ్యాతవకీలునైన శ్రీ నాగప్పగారు మహాత్మా గాంధిజీవితమునుగూర్చి మాట్లాడిరి సభ్యురాండ్రపక్షమున శ్రీమతి గౌరమ్మ గారు గాంధీజీవితముపైన నొకమంచివ్యాసమును వ్రాసిచదివిరి వీరుముఖ్యముగా గాంధి గారు స్త్రీలకుచేసిన సేవనుకొనియాడిరి. తరువాత అధ్యక్షులవారు మహాత్మా గాంధీ గారిజీవితమునుగూర్చి ఒకఘంటకాలముపన్యసించిరి.

చందావివరము
౧ సంవత్సరమునకు రు 6
౬ మాసములకు రు 3
(బ్రిటిష్ ఇండియాలో సం॥చందా ౫-౮-౦ కల్దారు)
పాతపత్రికలకు వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

THE ONLY … PAPER THAT REACHES The masses in the Dominions
* * *
BEST MEDIUM for Advertisement.

**Volume 16** **Hyderabad-Dn** **Monday 27th October 1941** *Number* **48**


## ఘోరమైన బందిపోటు-దొంగతనాలు

### రెండేండ్లనుండి రోహిలాలుచేసిన కార్యక్రమము

హైదరాబాదురాష్ట్రములోనిజిల్లాలలో అనేకస్థలాలలో రెండేండ్లనుండి తుపాకులతో ఆయుధాలతో (డాకాలు)బందిపోటుదొంగతనాలు జరిగినవి బయటపడినవి- వాటినిచూడగా చాలా భయంకరమైనవిగా కనబడుచున్నవి. ఈదొంగల గుంపులోనుండి ౧౦మంది పట్టుబడినారు. వీరందరున్ను రోహిలాలే ఈ గుంపునకు నాయకుడు ఉమర్ ఖాన్ అను రోహిలా. ఆతడు ఈ౧౦ మందితో పట్టుబడినాడు. ఈపట్టుబడినవారిలో కొందరు "ఆఫ్ఘానిస్తాన్ సైన్యము"లో సర్కారీ మిలిటరీ నౌకరులైయుండి ఉద్యోగమునుండి వెళ్ళగొట్టబడియుండిరి.

రెండేండ్లక్రిందట ఉమర్ ఖాన్ యొక్క ప్రధాన నాయకత్వములో ఈదొంగలగుంపు తమకార్యక్రమాన్ని ప్రారంభించిరి ఉమర్ ఖాన్ మంచి బట్టలువేసుకొని "షేషన్"కల పఠాను అనుచేయపొంది పెద్దపెద్దవారితో చేతులుచేతులు కలుపుచు బుజాలురాయుచూ తిరుగుతూవచ్చినాడు

ఈదొంగలగుంపుయొక్క స్వాకార్యసాధనకు పనిచేసిన ఆయుధాలేననగా తుపాకులు పిస్టలులు, బంబియాలు,కత్తులు, గొడ్డండ్లు, మున్నగునవి- వీరి వాహనాలు మోటార్లు, వివిధమైన ఆయుధాలను ధరించి మోటార్లలో అనేకులై వీరురాష్ట్రములోని గ్రామాలపైబడి అందరిధనికులయిండ్లు పగులగొట్టి దోచుకొనుచుండిరి-ఎవరైనా ధైర్యముచేసి ప్రతిఘటించప్రయత్నం చేసినట్లయితే వారికితమ బందూకులు [తుపాకులు] రివాల్వర్లు చూపించి "కాల్చుతాము మాకు"అని అదలగొట్టేవారు- అక్కడికి ఇంకెవ్వరైన తెగించి ప్రతిఘటించితే కత్తులతో వారినిగాయపరుచుచుండిరి-పోలీసువారువిచారణచేయగా ఇంతవరకు తెలిసినంతవరకు వీరు ౧౫౦ డాకాలు చేసినారట. ఇంచుమించు ౩౦౦౦౦రూపాయీల విలువగల బంగారు వెండి సొమ్ములను అపహరించినారట- ఈ౧౫౦ డాకాల కథలంతా రొట్టిమైయున్నవోయేమో? అందులోరెండు తెలియుచున్నది.

మెదకుజిల్లాలో లి గాపేట అను గ్రామములో ౨౫సెప్టెంబరు ౧౯౪౦నాడు నడుమురాత్రి ఒకకోమటియింటిపై వీరుపడినారు-౧౧౫౦౦ రూపాయీలవిలువగల సొమ్ములను లాగుకొన్నారు-

నిజామాబాదుజిల్లాలోని రేంజా అను గ్రామములో ౧౧సెప్టెంబరునాడునడుమురాత్రి ౫౦౦౦ రూపాయీలడాకాచేసిరి-అన్నింటికన్న ఘోరమైన విషయమేమనగా నల్గొండలోని కర్నపల్లిలో హిమాయతుసాగరంవద్ది హిమాయతునగరులోను వీరుబందిపోటుదొంగతనాలు చేసిరి. అచ్చటవీరిని ప్రతిఘటించిన గ్రామస్థులపై వీరు తుపాకులతో కాల్చి ౧౫మందికిగాయములుగలుగజేసిరి. కర్నపల్లిలో ౩౦ సెప్టెంబరునాడు నడుమురాత్రివేళ మూడిండ్లలోడాకాలుచేసి ౧౨౦౦రూ॥విలువగల సొత్తులపహరించిరి-గ్రామస్థులు ఈదొంగలను ప్రతిఘటింపగా వారిపైతుపాకులనుకాల్చి ౧౫మందినిగాయపరచి తమమోటార్లలోపడి మాయమైపోయిరి- హిమాయతునగరులో నడుమురాత్రివేళ కొంతమందినిగాయపరచి ౨౦౦౦ రూ॥ సొత్తులు దొంగిలించి పారిపోయిరి-౧౧అక్టోబరునాడు నడుమురాత్రివేళ అత్రాఫుబల్దాలోని వాదిరుగల్లు గ్రామముమీదపడి ౨౦౦౦రూ॥విలువగల సొత్తుల దొంగిలించిరి.

ఈగుంపు డాకాలుచేసిన యితరస్థలాలేవనగా కరీంనగరులో ౦ మలాపూరు పెద్దపల్లి ఖమ్మంలోనిబంసపోమారంగ్రామం, యెల్లందూ, మహబూబునగరు పెద్దనగరు, లక్కారుగూడ.

ఈదొంగలగుంపు సికింద్రాబాదు హైద్రాబాదునగరాలను తమముఖ్య కేంద్రాలుగా ఏర్పాటుచేసుకొని అచ్చట దొంగిలించినదానిని విభాగించుకొనుచుండిరి-సికింద్రాబాదులోని ఒకహోటలులో వీరుండినారని తెలిసి పోలీసువారువారిలో ప్రవేశించి వీరిలోకొందరినిపట్టుకొని వీరిగదిని శోధించగా తుపాకులు రివాల్వరు. కత్తులు దొరికినవి- ఇంతేకాదు-గొడ్డండ్లు, ఎలెక్ట్రికుటార్చిలైట్లు,ఇనుపపెట్టెలనుపగులగొట్టే కొరముట్లుమున్నగునవి చాలాదొరికినవి

మరొకవిశేషమేమంటే ఎక్కడనైతే డాకాకోలములో తుపాకులను కాల్చియుండిరో అట్టి తుపాకులలోఒకటి ఉమర్ ఖానువద్ద ఉండినది-ఆతడు దానిని బ్రిటిష్ఇండియాలోఉండే ఒక అఫీసరుమిత్రునివద్దనుండి యేదో సాకుచెప్పి దానిని తెచ్చియుండెను- ఇంకొకవిశేషమేమనగా హై

## గాంధీమహాత్మునితో దేశనాయకుల చర్చలు

ఇపుడు సేవాగ్రామములో గాంధీమహాత్ముని ఆశ్రమమందు కాంగ్రెసు కార్యపరిషత్తు సభ్యులు చాలామందివచ్చియున్నారు- సర్దారువల్లభాయిపటేలు, రాజేంద్రప్రసాదు, ఆచార్యకృపలాని అసఫ్అలీ గారలు అక్టోబరు ౨౧ వతేదిన గాంధీమహాత్మునితో చర్చించిరి. జైళ్లలోఉన్న కాంగ్రెసుఅధ్యక్షుడగు అబ్దుల్ కలాం ఆజాద్ గారితోను, పండితజవాహర్లాలునెహ్రూగారితోను సంభాషించవచ్చినట్టి మహాదేవ దేశాయి గారు కూడ ఆచర్చలలో పాల్గొనిరి- జయప్రకాశ్ నారాయణ గారు వ్రాసినారని చెప్పుచు ఒక లేఖను ఇండియాప్రభుత్వమువారు ప్రకటించియుండిరిగదా. ఆలేఖనుగురించి చర్చజరిగియుండవచ్చును-సత్యాగ్రహోద్యమమును గురించియు దేశములోపరిస్థితినిగురించియు కూడ వారలు చర్చించియుండవచ్చును- కాంగ్రెసు కార్యపరిషత్తు సభ్యులలో చాలమంది ఒకవారములోపల ఆశ్రమము దేశమునువదలినారు. అందువల్ల పోయినవారంతగా సెలవుండి కాంగ్రెసు ఉద్యమమునుగూర్చియు దేశములో రాజకీయపరిస్థితిని గూర్చియు వారలు సంపూర్ణముగా చర్చించవచ్చునని కనపడుచున్నది.

పూర్వపుమధ్యరాష్ట్ర మంత్రివర్గముయొక్క ప్రధానిఅయిన ఆర్- యస్- శుక్ల, డి-పి మిశ్ర, పి-బి- భారుకా గారలును అక్టోబరు ౨౧ వతేదిన గాంధిమహాత్మునితోను, సర్దారుపటేలు రాజేంద్రప్రసాదు గారలతోనుసంభాషించిరి

సింధుప్రధాని ఖాన్ బహదర్ అల్లాబక్షు గారు సింధురాష్ట్రపరిస్థితిగురించి మహాత్మునితో చర్చించుచున్నారు.

బెంగాల్ కాంగ్రెసు నాయకులువచ్చి సర్దారుపటేలు రాజేంద్రప్రసాదు ఆచార్యకృపలానిగారలతో చర్చించిరి బెంగాలురాష్ట్రములో అణచివేయబడిన కాంగ్రెసుసంఘములను తిరిగి పనిచేయనీయవలెననియు బెంగాలుశాసనసభ కార్యక్రమంలో తమకాంగ్రెసుపార్టీ ఎటువంటిఆటంకము లేకుండా పాల్గొనుటకు అనుమతించవలెననియు వారలు కోరినట్లుకనపడుచున్నది.

టంగుటూరు ప్రకాశం పంతులు గారు గాంధిమహాత్మునిగూర్చి కాంగ్రెసుకోరిన ప్రకారము ప్రజలకు సంపూర్ణపరిపాలనాధికారమును ఇచ్చివేసిననే గాని తిరిగి కాంగ్రెసువారు మంత్రిస్థానములలో చేరేమాట తలపెట్టరాదని చెప్పినారట-

## ఒకరోజుమాత్రమే హాజరు

ఈసారి భారతదేశశాసనసభయగు అసెంబ్లీ నవంబరు ౪ తేదినుండి సమావేశమగును- అందు ఆమొదటిరోజు ఒక్కరోజుమాత్రము కాంగ్రెసుసభ్యులు హాజరై తమసభ్యస్థానములను నిల్పుకొనదగునని కాంగ్రెసు పార్టీతీర్మానించినట్లు ఆపార్టీ నాయకుడగు భూలాభాయి దేశాయి గారు చెప్పుచున్నారు-

---

బాదులో నుండి కొందరు పెద్దపెద్దవారి మోటార్లను వీరుకిరాయబందిపోటు దొంగతనాలలో వినియోగించియుండిరి- హైద్రాబాదునగర పోలీసువారును జిల్లాపోలీసువారును కలిసి యీడాకాల విచారణచేయుచున్నారు ఇంకా యీగుంపులోనివారుకొందరు పట్టుబడవలెను- వారున్నూ పట్టుపడవచ్చునను చున్నారు-పోలీసువిచారణ యింకా జరుగుచున్నది

## వంగపల్లి నీలకంఠంగారు

## విశ్వాసరాహిత్య తీర్మానం

హైదరాబాదు(దక్కన్), ఆలూరుగా హైదరాబాదు సనాతనధర్మ సభవారు సికింద్రాబాదువాస్తవ్యులగు వంగపల్లి నీలకంఠం అనేవారు చేయుచున్న చర్యలనుకొన్ని అతనిపై తమకేమియు విశ్వాసములేదని పత్రికాప్రకటన ఈక్రిందివిధము గా చేయుచున్నారు.

"హైద్రాబాదు సనాతనసభలోని యీక్రింది సభ్యులు పండిత గోవిందరావు గంగాశేస్కరు అద్యకేటుగారి అధ్యక్షతలో సభచేసి మిస్టర్ వంగపల్లినీలకంఠం విషయములో విశ్వాసరాహిత్యమునుప్రకటించుచు అతనిని కార్యదర్శిపదవినుండి తొలగించవలెనను ప్రతిపాదనను చేసినారు. మిస్టర్ వంగపల్లి నీలకంఠం మాటిమాటికి హెచ్చరిక చేసినను సనాతన మహాసభా కార్యదర్శిపదవిలోఉండి స్థానిక పత్రికలలో సభయొక్క పాలిసీకి విరుద్ధముగా బాధ్యతారహితమైనట్టి అభిప్రాయప్రకటనను ప్రకటింపజేసెను వేలకొలది రూపాయీలను వ్యయముచేసినాడు. వాటిలెక్క నుపడయ్యాలని ఎన్నోమారులువిచారించినను ఇంతవరకు లెక్కల తనిఖీ చేయించకపోయెను- ఇంతేకాక ఇట్టికారణాలు ఇంకనుచాలా ఉన్నవి. వాటినంతా పత్రికలలో ప్రకటించడము బాగుండదని తలచినాము"

ఈతీర్మానముక్రింద యీక్రిందివారు సంతకాలు చేసినారు

(౧) పాండురంగరావుజోషీ వకీలు, (౨) రామదేవ్ పవారు వకీలు, (3) నరహరిరావువకీలు, (౪) పురుషోత్తమదాసుజీ సికింద్రాబాదు గౌరవ సెక్రెటరు (౫) సేట్ ముకుందదాసుజీముందడా (౬) సేట్ కన్హయ్యాలాల్జీపిత్తీ (౭)రాజాబంకట్లాల్ జీపిత్తీ (౮)నార్సింగ్ భటీరాల్ (౯)ఘనశ్యామదాసు ౧౦)కిషన్దాసుగోపాలుదాసు (౧౧)సరోజ్ మదాసు (౧౨) విఠల్ దాసు (౧౩) గోపీకిషన్ లాల్ కోటియా (౧౪)జగన్నాథజీ(౧౫)నరసింగభోలాజీ (౧౬) శ్రీకిషన్ ధూత్ (౧౭) రామ్ ఏకనాథ్ ప్రసాద్ పక్సీరా (౧౮) రామస్వామి రామ్ ప్రసాద్ (౧౯)శాకురుహరిసింగజీ (౨౦)లక్ష్మీనారాయణశర్మ (౨౧)అమృతరావు (౨౨)బంకట్లాలజీ బ్యాస్ (౨౩)లోకబంధూజీ (౨౪) సత్యనారాయణ్ (౨౫)హరినారాయణ్ (౨౬)గోటూరుకు సింహాచారి [౨౭] దామోదరరావుఓగదే-

## దీపావళిపండుగ బొమ్మల ప్రదర్శనము

మా॥ హనుమంతరావుగారు

ప్రతిసంవత్సరమువలెనే, శ్రీమతిపుష్పలతులక్ష్మమ్మ, వారిసమాక్షి శ్రీమతి రాధాబాయమ్మగార్లు సుల్తానుబజారువీధిలోనితమస్వంతభవనము రాధావిలాసమునందు దీపావళిపండుగ సందర్భమున బొమ్మల ప్రదర్శనము మహోత్సాహముతో జరిపిరి.

ప్రదర్శనములో, మధ్యభాగమున "కాళీయఫణి ఫణాగ్రమునతాండవమాడు అనుగడమ్ము లుగల శ్రీకృష్ణుడును, శ్రీకృష్ణుని ప్రార్థించు అంగనలున్ను కన్నులకు పండువుచేయుచుండిరి దానికొకప్రక్కన. కీచక సైరంధ్రీవిగ్రహములును, వేరొకప్రక్కన గోపికలచే పరివేష్టింపబడిన కృష్ణునిప్రతిమయుండెను ఇట్టివేయింకనెన్నిసందర్భములుకల్పింపబడెను నూతనమైన ప్రతిమలన్నియు హృదయాకర్షకములగుఅలంకారములతోను, వస్త్రములతోను చూచువారికి మనోహరదృశ్యము ఉత్పత్తిపరచియుండెను వివిధవర్ణశోభితములగు విద్యుద్దీపకాంతులును రేడియోగీతములును శోభను పెంపొందించుచుండెను.

ప్రతిదినము సాయంత్రమునుండి రాత్రిప్రొద్దుపోవువరకు శ్రీమతి తులసమ్మగారివలన నాహ్వానింపబడిన సోదరీసోదరులువచ్చి ప్రదర్శనమును జూచియానందించి సుగంధ, తాంబూల, నారికేళాదులనుతీసికొనివెళ్లుచుండిరి

ప్రదర్శనము మనోహరముగా ఏర్పాటుచేసిన అ భ్రసోదరీమణులు ప్రశంసార్హులు:

## బొంబాయిఢక్కాలలో అల్లరులు

బొంబాయిలోను, ఢక్కాలోను మరల అల్లరులు ప్రారంభమైనవి అక్టోబరు ౨౪ వతేదిరాత్రి పైధోనివద్ద హిందూముసల్మానుల కొట్లాటలవల్ల రాళ్ళురువ్వుకొనుట, కత్తులతోపొడుచుట జరుగుచుండుట ఇంతలో ఆయుధధారులైన పోలీసులువచ్చి లాఠీలప్రయోగించి తుపాకులుకాల్చుట ఇవన్నియు శరవేగముగ జరిగినవి.

౬ గురుచచ్చిరి ౪౪ మందికిగాయములైనవి,

ఢక్కాలో ౨౩ వతేదిరాత్రి ఒకరంజానుఊరేగింపుపోవుచుండగా దానిపై దెబ్బలువేయుటచే ౧౦మంది గాయపడిరి వారిలోఒకరుమరణించిరి అక్టోబరు ౨౨ వతేదిన ఢక్కాలోఅల్లరులు మరల ప్రారంభమైనది పొందలు కెగురుచచ్చిరి ౧౩ మంది గాయపడిరి.

### బొంబాయిలో తోళ్ళపదును పరిశ్రమాభివృద్ధి

బొంబాయి ప్రభుత్వ పారిశ్రామికశాఖవారు నియోగించిన తోళ్ళపరిశ్రమ ప్రచారకులు చాలా ఉత్సాహకరమైన పనులను సాధించినారు, పూనాజిల్లాలో టాకీగాఫ్ దండీర్ లో వారల ప్రయత్నముచే తోళ్లపదును పరిశ్రమ మంచివృద్ధికి వచ్చినది. అపరిశ్రమచే జీవించు చర్మకారులు తామే చేరయిచ్చి ఒక ఉపాధ్యాయుని ఏర్పాటుచేసికొని ఒక కిండర్ గార్టెన్ పాఠశాలను స్థాపించుకొనగలిగినారు ఈ చర్మకారులందరును ఒకచోట కలిసి పనిచేయుటచే ఒక సిద్ధము తోళ్ల పనుముచేయు పనిముట్లకు వారలకిమ్మటక్కు రూ ౩౫౦ లు ఖర్చుఅయినవి.






Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.